కోకిలమ్మనీ, ఎఱ్ఱకలువపువ్వునీ, చిన్నిమేఘాన్ని, మేకల్ని, పసులకాపరినీ చూస్తాడు. భర్తకి మధ్యాహ్నపు కూడు తీసుకొని వెడుతూ—

ఈవలొడ్డుకు పట్టు
ఆవలి బల్లకట్టు
ఘోలములో నావా
తలపోయు చుంటాడు

అంటూ బల్లకట్టు గడిపే సరంగుని బతిమాలే పల్లెపడుచునీ "ఎఱ్ఱఎఱ్ఱ సంజలో పరకలేరుకొంటూన్న నల్లనల్లనిపిల్ల కిఱ్ఱుపెట్టిన జోడు సర్దుకొంటున్' వచ్చే రైతునిచూసి—

"జొన్న మొలకలచాటె
సన్నసన్నగదాటు
మూరువారవ యీ౽పెనూ"

ప్రత్యక్షము చేస్తాడు. ఈదృశ్య చిత్రాలన్నీ జనపదాలలో అతి సామాన్యమైనవే. కాని ఈకవి చేతులలో అవి అతి సరళమైన భాషలో కవితారూపము దాల్చాయి. ఇలాగే రంగంనుంచీ వచ్చిన రంగని రంగులూ, వాడి పెళ్ళాం రా[illegible] కున్న హంగులూ హృద్యంగా కవి వర్ణిస్తాడు. ఇలా చెప్పాలంటే ఈయన రచన[illegible] లలోనుంచి ఎన్ని ఉదాహరణలనేనా ఇయ్యవచ్చు. మొట్టుకి ఈయన రచనలలో జనపదములన్నీ మనకు ఆత్మీయములైన వనిపిస్తుంది. జానపదుల జీవితదృశ్యాల్లో అనుదినం మన కళ్ళపడే దృశ్యాల్లోని అందము మనకళ్ళకి కన్పించి మనస్సు[illegible] పట్టుతుంది. శతాబ్దాల తరబడి మూగవారిఉన్న జానపదుల గొంతుల్లోంచి పలికిన కవితారసాన్నిపట్టి అర్పించిన ప్రజాకవి కవికొండల.

కవికొండల జన్మతఃకవి, పరిసరములవల్లా సుహృదయుల మిత్రులతోటీ గురుపర్యుడయిన కూల్డ్రేదొర సాహచర్యమువల్లా పెంపొందిన కవితాత్మయే, ఆయన రచనల్లో మెరిసింది. జానపదుల జీవితాల్నీ వారి కష్టనిష్ఠూరాల్నీ, తలపు బరువుల్నీ, ఆశల్నీ, అనురాగాల్నీ సూటిగా తేటమాటలతో గేయరూపంగా చిత్రించిన జానపదకవి కవికొండల. వాటిలోని విషయాల్నిబట్టి ఈయనని గౌతమీతీర ప్రాంత సుందరదృశ్య మోహితుడయిన కవికొండలఅనీ, కొండకీలకు వికసితో

త్వల కవిత అని అనాలి. మన ప్రాచీన జాన తెనుగు రచయితలలోనూ, అజ్ఞా
కవుల మధుర జానపద గేయాలలోనూ తొణికిసలాడుతూ సాంప్రదాయికముగ
తెలుగువారి రక్తంలో ప్రవహిస్తున్న కవితా స్రవంతియే గేయరూపంతో ఈయ
లోంచి పైకి ఉబికి[illegible]. అందుచేత ఈయన అవలంబించిన మార్గాన్ననుసరించి
తెలుగు రచయితలు జానపద గేయ వాఙ్మయాన్ని పదేపదే మథించి తెలుగు సర
స్వతిని పుష్టివంతం చేస్తారని ఆశిస్తున్నాను.

సంపూర్ణము.

మహోదయ ప్రెస్, శ్రీకాకుళం.